# బాల వితంతు విలాపము.



మంగిపూడి వేంకటశర్మ

విరచితము.



ఐదవకూర్పు.



అధరాపురపు వాసుదేవరావుచే

శ్రీ సౌదామినీ ముద్రాక్షరశాల ముద్రితము

తణుకు.

౧౯౩౯.

[సర్వస్వామ్య సంకలితము.] [దీనివెల ౬ అణాలు.]



# బాల వితంతు విలాపము.



సీ. శృంగారవతికి ముంగొంగు బంగారంబు
కీరభాషిణికిఁ దంగేటిజున్ను
కిసలయాధరకు ముంగిటి కల్పభూజంబు
పున్నాగుఁబోణికిఁ బూలదండ
హరినీలవేణికి నరచేతిరత్నంబు
ధవళలోచనకు సుధారసంబు
యువతికిఁ బెరటిలో నున్న వేలుపుటావు
లలనకు నిత్యకల్యాణశోభ
గీ. పూజ్యచరితకు దివ్యసామ్రాజ్యపదవి
ప్రాణనాథుండు సతి కట్టిపతియె లేని
జాణతన మేల? సొగ సేల? సౌఖ్య మేల?
జవ్వనం బేల? జగ మేల? జన్మ మేల? ౧

సీ. లలనల యానంద లతలకు మూలంబు
చెలువల సంతోసములకు వసతి
ప్రమదల సౌఖ్యసంపదలకు సదనంబు
నెలతల యుత్సాహములకు నెలవు

కాంతల రాగభోగముల కాధారంబు
తరుణుల శుభపరంపరల బరణి
ముదితల సౌందర్యముల కలంకారంబు
భామల సౌభాగ్య భాగ్యసీమ
గీ. స్త్రీల జీవనములకు సంజీవికరణి
జీవితేశ్వరుఁ డతని బాసిన పురంధ్రి
జాణతన మేల? సొగ సేల? సౌఖ్య మేల?
జవ్వనం బేల? జగ మేల? జన్మ మేల?

సీ. ధన మేల? నెఱజాణతన మేల? బలుగాణ
తన మేల? పతిలేని తరుణులకును
విరు లేల? వెలలేని సరు లేల? దరిలేని
సిరు లేల? పతిలేని చెలువలకును
హితు లేల? ప్రియబంధు తతు లేల? గుణసింధు
సుతు లేల? పతిలేని సుదతులకును
నగ లేల? జిగిఁజిల్కు తొగ లేల? తమిఁగుల్కు
వగ లేల? పతిలేని వనితలకును
గీ. భోగ్యవస్తువు లవి యేల? భాగ్య మేల?
రాజ్య మది యేల? ప్రాజ్యసామ్రాజ్య మేల?
క్రీడ లవి యేల? మిద్దెలు మేడ లేల?
విద్య లవి యేల? పతిలేని వెలఁదులకును.

సీ. పూర్ణచంద్రునివంటి ముఖవిలాసముగల్గి
కలువరేకుల నేలు కనులుఁగల్గి
మహితచంద్రికఁబోలు మందహాసముగల్గి
యిరులఁ గేరడమాడు కురులుఁగల్గి
తమ్మికెంపులమించు దంతకాంతులుగల్గి
నవచంపకముగేరు నాసగల్గి
చిగురుటాకుల గెల్వఁదగు కరంబులుఁగల్గి
మేల్మిబంగరుచాయ మేనుగల్గి
గీ. చిలుకవలె ముద్దు చిలికెడు పలుకుఁగల్గి
నెఱతనము గల్గి విద్యల నేర్పుగల్గి
మగఁడులేకున్న యట్టి యమ్మగువసొగసు
అడవిఁగాచినవెన్నెల యగును గాదె? ४

సీ. చంద్రికలేనట్టి చంద్రుని చందంబు
నీరులేనట్టి కాసారమట్లు
కీలూడినట్టి పాంచాలిక పోలిక
జీవకళయెలేని చిత్రమట్లు
ప్రాణంబులేని కాయంబు విధంబున
కలికి పల్కులులేని చిలుకకేతి
తంతులులేని నిద్దపు వీణకైవడి
తళుకులేనట్టి యద్దంబుకరణి

సీ. కబళంబు భుజియింపఁగా జిహ్వ కింపౌనె?
విభుఁడు లేనట్టి యావెలఁదులకును
అరఁగంటనేని నిద్దుర నొందవచ్చునే?
మగఁడు లేనట్టి యాసుగుణవలకును
మదికి నెమ్మది యొక్కమాత్రైనఁ గల్గునే?
ధవుఁడు లేనట్టి యాతరుణులకును
సఖులసాన్నిధ్యంబు సౌఖ్యంబు గూర్చునే?
యధిపతిలేని యాయబలలకును

గీ. తరమె? చల్లార్ప ఘోరసంతాపవహ్ని
రమణుఁడేలేని యానవప్రమదలకును
నిల్పశక్యమె? తను వరనియమసమైన
నధిపుఁడేలేని యవ్విశాలాక్షులకును.

సీ. మనుజులం దన్యోన్యమైత్రి బాంధవ్యముల్
కలుగుటకై యేది కారణంబో?
పశుసమానులు గాక ప్రజలెల్ల సుమతులై
క్రాలుచుండుట కేదికారణంబో?
స్త్రీపురుషులు చెల్మిచేఁ గట్టువడుచు నై
క్యమున నొప్పుట కేదికారణంబో?
పురుషులున్ స్త్రీలు పరస్పరముఁ గార్యములందుఁ
గై దోడగుట కేదికారణంబో?

గీ. అట్టిపరిణయ బంధంబునందు దూర
దృష్టి భవితవ్యమును విచారింపఁబోక
పైకమిచ్చిన వారికే బాలికలను
గట్టిపెట్టుట యిది యెట్టికర్మ? మకట! ౧౦

సీ. దేహదార్ఢ్యముగల్గు ధీగు లుద్భవమందఁ
దగినసాధనము సత్పరిణయంబు
అనుపమానకుశాంకు రాగ్రబుద్ధులుగల్గఁ
దగినసాధనము సత్పరిణయంబు
జన్మదేశావనోత్సాహ చిత్తులుగల్గఁ
దగినసాధనము సత్పరిణయంబు
మాతృసేవకరత్న మాణిక్యములుగల్గఁ
దగినసాధనము సత్పరిణయంబు

గీ. అట్టిపరిణయములఁజేయు పట్టులందు
నీడు జోడును మున్నుగాఁ జూడఁబోక
పైకమిచ్చినవారికే బాలికలను
గట్టిపెట్టుట యిది యెట్టికర్మ? మకట! ౧౧

సీ. ఐకమత్యముఁగూర్చి యువనీతలమునెల్లఁ
గట్టఁగాజాలు పగ్గంబు పెండ్లి
ఇహపరలోక సౌఖ్యైక దాయకముగాఁ
దనరాగు మేటిసాధనము పెండ్లి

కాలక్రమాగత కష్టసాగరముల
దాఁటింపజాలినతరణి పెండ్లి
ఆమయదుఃఖంబు లణఁచి సౌఖ్యంబుగా
జీవింపఁజేయు సంజీవి పెండ్లి
గీ. అట్టిపెండ్లిండ్లు చేసెను పట్టులందు
సూక్ష్మమతి దూరదృష్టులఁ జూడఁబోక
దంపతుల భావిగతులఁ దలంపఁబోక
వేగిరింతురు కొందఱు వెఱ్ఱు లకట! ౧౨

సీ. వైవాహికంబు లెవ్వరిసౌఖ్యసంతోష
ములనిమిత్తములుగాఁ దలఁపఁబడెనో?
హానిలోపమున నెవ్వరు కలకాలంబుఁ
గష్టనష్టములొందఁ గలుగువారో?
తమజీవితమున సాధకబాధకములను
దలఁపోయ నెవ్వారు తగినవారో?
ఐహికదుఃఖ సౌఖ్యంబులం దెవ్వారు
తగఁబాలుపంచుక తనరువారో?
గీ. అట్టిదంపతుల పరస్పరాభిలాష
నెమ్మిఁ గనుఁగొనకయె యక్రమమ్ముగాను
దల్లిదండ్రులె స్వాతంత్ర్య మెల్లదాల్చి
చేయుచున్నారు పెండ్లిండ్లు చెనఁటులకట! ౧౩

సీ. పాత్రిళ్ళలోనున్న నెత్తుటికందుల
పెండ్లిండ్లుసేయ భావించునొకఁడు
పురుడు వోవకమున్నె బొట్టెల నమ్మంగ
బేరసారములు గావించునొకఁడు
కన్నులు తెఱవని కసుగాయలను గట్టి
పెట్టి వృద్ధులను సేవించు నొకఁడు
పాలైన విడువని పసికూనలను గూర్చ
మించుదళారి రావించు నొకఁడు
ఆ. వె. అమ్మ తాత యత్త యనుతొక్కుపల్కులే
పలుకలేని చిన్ని పాపలకును
రామ! రామ! ముందు రానున్న దెంచక
చెనఁటియగుచుఁ బెండ్లిసేయు నొకఁడు. ౧౪
సీ. మంచి సంబంధంబు మఱి వచ్చునో? లేదో?
యంచు లోలో సంశయించి యొకఁడు
కట్నంబు ముం దింతకంటెను నధిక మీ
వలయునో? యంచు భీతిలి యొకండు
మనము పూర్వాచారమును మానఁగానేల?
యంచుడెందమున యోజించియొకఁడు
చిన్ననాఁడే పెండ్లి చేసిన గుణవంతు
లై ప్రతిష్ఠను దెత్తు రంచు నొకఁడు

గీ. పెండ్లిలోపలఁ బెండ్లి గావింతుమేని
కలసి వచ్చును కర్చని తలఁచి యొకఁడు
దంపతుల భావి సౌఖ్యముల్ దలఁప బోక
చేయుదురు పెండ్లి మూర్ఖులై చిఱుతలకును. ౧౫

సీ. కన్నులారంగ మాంగల్య ధారణము నె
ప్పుడుచూతునో? యంచుఁబొంగిపొంగి
చేతులారఁగఁబెండ్లి చేయఁగల్గుట యెన్నఁ
డో? యంచు నువ్విళులూరి యూరి
చెవులార వినుటెప్డొ? చిన్న యల్లుఁడు పల్కు
మృదువాక్కులనుఁకోర్కి మించిమించి
మనమారఁ జుట్టాలఁ దనియింతు విందుల
చే నెప్డొ? యని యూహ చేసి చేసి

ఆ. వె. భూరి దక్షిణలను భూమిసురులఁ దన్పి
యశము గాంచు టెపుడొ? యని ముదమునఁ
దోఁగి తోఁగి త్వరను బాగోగు లరయక
చేయుచుందురు పెండ్లి చిఱుతలకును. ౧౬

సీ. గడప యెప్పుడు పచ్చఁగా నౌనొ? యని చూడ
వాచి యున్నవి నాదు లోచనములు
ద్వారమం దెన్నఁడు తోరణం బుండునో?
యని చూడ ముచ్చట యగును నాకు

వియ్యంపు నడపులు వేడ్కతో నడుపంగ
సారె సారెకుఁ గోర్కె సాగు నెపుడు
వలనుగా మన పాప తలఁబ్రాలు చూడంగ
నుల్లమం దువ్విళ్లు లూరుచుండు
గీ. కాంతు దీఱంగ నల్లుని కాళ్ళు గడిగి
ధన్యతను గన్యకను బ్రీతి ధారపోయు
వేడుకను జూడవలెనని విభుని వేఁడి
చేయుదురు పెండ్లి ముగ్ధలు చిఱుతలకును. ౧౨

సీ. ముద్దు ముచ్చట దీఱ ముక్కు ముక్కరయైనఁ
బెట్ట డీమగఁడంచుఁ దిట్టి తిట్టి
గడనలో నగలకై గవ్వైన మిగులదు
నడపీనుఁ గితఁడంచు నవ్వి నవ్వి
తోడివా ర్నగలతోఁ దులఁదూఁగ మోహమునై
నే నేడ్వవలెనంచు నేడ్చి యేడ్చి
వంటకంబును విస్తరంటలో నిడి తాఁగ
నైన యెప్డుఁ గయ్యమ్ము లాడి యాడి
గీ. విభుని ప్రాణాలు విసిగించి వేచి తినెడు
కూళతనమున మించు గయ్యాళియాండ్రు
పోరుపడలేక దయమాలి క్రూరులగుచుఁ
బుత్రికల నమ్ముచున్నారు పురుషు లకట ! ౧౩

సీ. తనకు సూకలు వచ్చునను సంబరమెకాని
తనయసూకల మాటఁ దలఁపదెపుడుఁ
దనకుఁ గోకలు వచ్చునను సంతసమెకాని
తనయ కోకలమాటఁ దలఁపదెపుడుఁ
దనకు రైకలువచ్చునను కౌతుకమెకాని
తనయరైకల మాటఁ దలఁపదెపుడుఁ
దనకు సూకలు వచ్చునను హెచ్చరికెకాని
తనయ సూకలఁ మాట దలఁపదెపుడు

ఆ. అకట ! ముక్కు పచ్చలారని పసిపాప
సంగడికినిఁ బంపి యమ్మినట్లు
స్వార్థ పరత శుల్కమాసించి యమ్ముడు
తల్లి సుతల పాలి భిల్లికాదె? ౧౯

సీ. కలిమి లేముల మాటఁ గలనైన దలఁపరు
అచ్చుపు శీలంబు నరయఁ బోరు
తెలివి తేటల సంగతిని విచారింపరు
సద్గుణైశ్వర్యంబు చాయఁబోరు
సంప్రదాయంబు వంశంబుఁ జింతింపరు
ప్రాయంబు చందంబు రోయఁబోరు
విద్యయు గరిమంబు వివరించి చూడరు
సోయగంబుఁ బరీక్ష సేయఁబోరు

గీ. జాతి చూడరు నాడుల జాడఁ గనరు
జంపతుల మానసంబు లేచందమునను
గలియు ననుకొందురో గాని కరుణమాని
శుల్కమున కమ్ముచున్నారు సుతల నకట! ౨౦

సీ. పీటపైఁ గూర్చుండఁ బెట్టినవేళను
మాతకై పెండ్లికుమారుఁ డేడ్వ
తాళిఁగట్టెడువేళఁ బాలకై పోట్లాట
గోలుగోలునఁ బెండ్లికూఁతు రేడ్వ.
విభుఁడు సూత్రము ముడివేయలేఁడని పురో
హితుఁడె కన్యకుఁ దాళి నతుకఁబెట్ట
తలఁబ్రాలు పసిదంపతులు పోయలేకున్న
వరుసవా రావేళ్ళ జరగఁజేయ

గీ. పల్లకీనెక్కి యూరేగు పట్టులందె
యాదమరచి నిద్రించెడు నట్టి చిట్టి
కందులకుఁ బెండ్లి సేయుటకంటె లక్క
బొమ్మలకుఁజేసి ముచ్చటల్ పొందరాదె? ౨౧

సీ. బువ్వ బువ్వ యటంచు బోరున నేడ్చెడు
కసుగాయలకు గాయ కసరులిచ్చి
కూనలతో నాఁడుకొనబోదు నని యేడ్చు
తటిని బొమ్మలను ముందరనువైచి

బాజాలు వాయింప భయపడి యేడ్చు న
ప్పుడు మంచిమాటల బుజ్జగించి
మెడలోన మినుకును ముడివేయునెడ బూచి
యని యేడ్వ మెల్లన నలుకుఁ దీర్చి
గీ. మఱియు నెన్నెని విధముల మాటిమాటి
కేడ్చు బిడ్డలయేడ్పు లెట్టెట్టొ యుడిపి
బలిమిచేఁ దల్లిదండ్రులు సలుపునట్టి
పెండ్లియును బెండ్లియే? పెద్ద పెండ్లిగాక. ౨౨

సీ. మొదట బాలారిష్టములఁ బ్రాణభయము లా
గండంబు లెట్లైనఁ గడచు నేని
సదమల విద్యాలసద్గుణవ్యాప్తికి
సంపూర్ణ విఘ్నంబు సంభవించు
సమకళా గుణవయ స్సౌందర్య మహితులు
కారేని చెందముల్ గలియు టరుదు
చెందముల్ గలియకుండిన రాజకీయముల్
సదనకృత్యంబులు సాగఁబోవు
గీ. జగడములు గల్గు నిరతంబు దంపతులకు
దాన సంసారమున రక్తి తగ్గిపోవు
దోసఁగు లెన్నెని యామీఁద బొసఁగుచుండుఁ
గాన బాల్య వివాహముల్ మానరయ్య! ౨౩

సీ. స్త్రీవిద్య మొదలంట క్షీణించుచుంట కే
కనుగాయ పెండ్లిండ్లె కారణములు
ప్రజలెల్ల మిగుల దుర్బల దేహులగుట కే
కనుగాయ పెండ్లిండ్లె కారణములు
మానవుల్ ఘోర దుర్మతులవా లగుట కే
కనుగాయ పెండ్లిండ్లె కారణములు
కట్నముల్ శుల్కముల్ కడువృద్ధిఁ గనుట కే
కనుగాయ పెండ్లిండ్లె కారణములు
గీ. వేయిమాటలేల? విధవల సంఖ్యయుఁ
బ్రబలి దేశమునకు భారమైన
కష్టిఁదెచ్చి పెట్టఁ కనుగాయ పెండ్లిండ్లె
కారణములు నాశ కారణములు. ౭౪

సీ. సంసారమనెడు వృక్షమునకే పెండ్లిండ్లు
వేరు పురుగులె యంట వింతకాదు
వేరముల్ పోసగించు విద్యకే పెండ్లిండ్లు
నారదాంశములంట నవ్వుకాదు
కనుచుండఁ గుతుకంబుఁ గోసుటకే పెండ్లిండ్లు
గజదొంగలంట యక్కజముకాదు
విడువని దుఃఖంబు లిడుటకే పెండ్లిండ్లు
కడగండ్ల గనులంట కల్లకాదు

గీ. భవనము వనమ్ముగాఁగఁ గన్పడఁగఁ జేసి
యతుల గతుల దంపతులను నరయ మలయఁ
జేయు ప్రిజ్ఞకీ పెండ్లిండ్లు చేటుఁజేయు
గ్రహములనియంట సంశయావహముకాదు. ౨౫

సీ. చెలువురాణించు రా చిలుకకూనలఁ బెంచి
పెంచి పిల్లికి సమర్పించినట్లు
చెఱకు చే నేపుగా బెఱుగునంతకుఁగాచి
కాచి నక్కలపాలఁ ద్రోచినట్లు
చేతులారఁగ నీళ్ళు చేది పోషణ జేసి
చేసి పూదీంగెలం గోసినట్లు
జింకపిల్లలం గూర్మి చిలుకం జేరంగఁదీసి
తీసి బెబ్బులి నోటవేసినట్లు
గీ. పదినెలలు మోసి మముఁగాంచి బాలిమీఱం
బెంచి మామూలమున సేకరించి ధనముం
దుదకుం బ్రేమానుబంధంబుం దుంచి ముసలి
దయ్యములకప్పగింతురే! తల్లులార! ౨౬

సీ. మిసమిస లాడెడు మిసిమి బంగరుచేల
పిండి బొమ్మకు గట్టిపెట్టినట్లు
నిండునిగారంపు దొండపండును మాల
కాకిముక్కున వ్రేలగట్టినట్లు

నిగనిగమను నింద్రనీల మాణిక్యంబుం
గొని పాదరక్షను గూర్చినట్టు
తలతల మనెడు రత్నంపుదీపము శూన్య
నిలయ మధ్యము నందు నిల్పినట్టు
గీ. దయయు దాక్షిణ్యమును బాప భయము మాలి
శుల్కమున కాసపడి త్రిపాశూన్య వృత్తి
లేఁత వయసున నున్న బాలికలఁ బట్టి
ముసలి దయ్యాలపాల్సేత ముప్పుకాదె? ౨౭

సీ. ఘుమఘుమ మను స్వచ్ఛ గోఘృతంబును దెచ్చి
బూడిదలోఁ బారఁబోసినట్లు
మేలైన యాణిముత్యాలపేరును గొమ్మ
ద్రిమ్మరిచేతి కందించునట్లు
రమణీయతర పద్మరాగ మాణిక్యముల్
ముసిడి పండ్లకు వెలఁబోసినట్లు
పెద్దకాలము మేకపిల్లలఁ బోషించి
పెద్దమ్మవారి కర్పించినట్లు
గీ. దయయు దాక్షిణ్యమును బాప భయము మాలి
శుల్కమున కాసపడి త్రిపాశూన్య వృత్తి
లేఁత వయసున నున్న బాలికలఁ బట్టి
ముసలి దయ్యాల పాల్సేత ముప్పుగాదె? ౨౮

సీ. గమగమ మను మంచి గందంపు తరులను
గట్టెల కోసమై కొట్టినట్టు
తలలోన నున్న ముత్యాలకై యాశించి
మద కరీంద్రముఁ బట్టి చదిపినట్టు
చేతి కందని పండు జేకొంటకై చెట్టు
గొడ్డంట వేళ్ళతోఁ గూల్చినట్టు
ఎలుకలబాధ మాయింపఁగా నూహించి
యింటికి నగ్గి నంటించినట్టు
గీ. దూరభారంబుఁ జూడక దోసమనక
శుల్కమున కాసపడి త్రిపాశూన్య వృత్తి
లేఁతవయసున నున్న బాలికలఁ బట్టి
ముసలి దయ్యాల పాల్సేత ముప్పుకాదె? ౨౯
సీ. అతి బాల్యమున వివాహంబు సేయుటకంటె
గుత్తుకఁ గత్తిచేఁ గోయరాదె?
కడువృద్ధునకు బల్మిఁ గట్టిపెట్టుటకంటెఁ
బుట్టఁగానె విషంబుఁ బెట్టరాదె?
శుద్ధ మూర్ఖునితోడ జోడుఁ గూర్చుటకంటెఁ
దెంపున గంగలో దింపరాదె?
శుల్కంబుఁ గొని మమ్ముఁ జుల్క చేయుటకంటెఁ
పెద్దమ్మవారి కర్పింపరాదె!

గీ. ప్రాణపదముగఁ బెంచు మేలైన కురులు
కళకు గలిగిన మంగలి కత్తిపాలు
చేయుకంటెను బ్రాణముల్ తీయరాదె?
దనుజసములార! హా! తల్లిదండ్రులార! ౩౦

సీ. వర దక్షిణల మీఁది వాంఛచే నొక్కండు
పిల్ల చక్కనిదంచుఁ బ్రేమ నొకఁడు
గొప్ప సంబంధమన్ కోర్కెచే నొక్కండు
మేనరికం బన్న మేర కొకఁడు
ప్రాఁత చుట్టరిక మఱి ప్రీతిచే నొక్కండు
పెండ్లి కా దీఁక నంచు భీతి నొకఁడు
తల్లి దండ్రుల యాజ్ఞ దాఁటలే కొక్కండు
స్వల్పశుల్కంబన్న భ్రాంతి నొకఁడు
గీ. ఇల్లటఁపు టల్లుఁడై యుండ నెంచి యొకఁడు
నత్తవారింటి యాస్తిపై నాస నొకఁడు
ముందు ముప్పెఱుఁగక చిన్ని ముద్దియలను
బెండ్లి యాడుచు నున్నారు పెద్దవారు. ౩౧

సీ. ప్రథమ కళత్రంబు పడసిన సంతతిఁ
బోషింప నెవ్వరుఁ బూనరనుచు
తనకున్న ద్రవ్య మంతయును ననుభవించు
వార లెవ్వారును లేరటంచు

పుత్రులు లేకున్నఁ బున్నామ నరకంబు
మానవులకు నెల్ల మాన దనుచు
అర్ధాంగి లేకున్న నవసాన దశయందుఁ
దనకు దిక్కెవ్వరు దగుల రనుచు
గీ. పురుషవరుఁ డపత్నీకుఁడై పరఁగనేని
కర్మకాండకు భంగంబు కలుగు ననుచుఁ
దమరు పెండ్లికిఁ దగకున్నఁ దగవు మాలి
పెండ్లిఁగోరుచు నున్నారు పెద్దవారు. ౩౨

సీ. సరి మీఱ మంగళ స్నానంబు సేయుచో
వలి చేత గడగడ వడఁకి వడఁకి
ప్రియ మొప్ప హోమముల్ వేల్చుచోఁ గనరాక
యాజ్యంబు బూడిదెయందు వేల్చి
క్రొత్త వస్త్రముఁ గట్టుకొన నిల్వఁగాలేక
యచ్చటి వారి సాయంబు వేఁడి
అగ్ని ప్రదక్షిణం బాచరించుచు నొడల్
దిరిగి పీతాక్షులై ధరణి వ్రాలి
గీ. పాటవము పీటపై నిల్చుపాటిలేక
చిట్టి బొట్టెల సిగ్గరి చెట్టఁబట్టు
పెద్దవారికి వేలాము వెట్టిగాక
యేమిసంతోస? మిల్లాలి కేమిసుఖము? 33

సీ. అసుర సన్నిధి నరుం డనుభవించు సుఖంబు
సింగంబు దరి కరి చెందు సుఖము
కారు బెబ్బులి చెంత గంగగోవు సుఖంబు
పాము గీమునఁ గప్ప పడయు సుఖము
చీలి చెంగటి చిన్ని చిలుక కబ్బు సుఖంబు
భిల్లుపొంతను నెమ్మి పిల్ల సుఖము
కాకి కట్టెదుటి పికంబు కాంచు సుఖంబు
గరుడు ముంగిటి నాగ కాంత సుఖము
గీ. చెనటి తోడేలు నెడ మేక గనెడు సుఖము
డేగ దెస పావురంబు పొందెడు సుఖంబు
బకము ముందరి మీనశాబకము సుఖము
తగని మగనింట మగువకు దాపరించు. ౩౮

సీ. చిన్నారి నారియై చెన్నారెడునుగాక
రహిం గుల్కు నేర్చునే రమణుఁబాసి
బిత్తరి చిత్తరై పెంపుఁ బెంపునుగాక
రహిం గుల్కు నేర్చునే రమణుఁబాసి
చిత్రాంగి సీమనై చెలఁగుచుండునుగాక
రహిం గుల్కు నేర్చునే రమణుఁబాసి
చదురుల కుదురైన చదురాలగునుగాక
రహిం గుల్కు నేర్చునే రమణుఁబాసి

తే. శీలశాలినినై పరికాశించు(గాక
నీతి విస్ఫీతమై సంచనించు(గాక
సతుల తలమానికంబుగా బ్రతుకు(గాక
రహి గులుక నేర్చునే పాపిణరమణు(బాసి. ౩౫

సీ. పేద వాడ నటంచు( బెద్ద కూ(తును బైత్య
రోగి కిచ్చెను వేయి రూప్యములకు
ఋణము( దీర్తునటంచు రెండవ సుత నిచ్చె(
బేడివానికి వేయి మాడలకును
యజ్ఞంబు( జేసెదనంచు మూ(డవ బిడ్డ
వెయి వరాలకు నొక్క వెట్టికిచ్చె
కఠినాత్ము(డై నూఱు కాసులకును మూ(డు
గాళ్ళ ముసలికిచ్చె గడకు( నన్ను

గీ. రత్నములవంటి బిడ్డల ఱాళ్ళపాలు
చేసియును దాను జేసిన దోసమున్నొ?
బాగుపడలేదు మాతండ్రి బాగుపడునె!
కన్న బిడ్డలనమ్ము రాక్షస ఖలుండు. ౩౬

సీ. బొమ్మల పెండ్లిండ్ల పోల్కి బాలల పెండ్లి
యింపు(గొల్పు నటంచు నెంచియెంచి
మనుమరాలి వివాహమును జూచి హర్షింతు
తాత యవ్వ యటంచు( దల(చితల(చి

సుత పుష్పవతి యైనచో బ్రాహ్మణత్వమే
పోవునం చెద భీతిఁ బొందిపొంది
శుల్కంబుఁ గొని యొక్కచో వద్ది కిడిన ద
బ్బిబ్బడి యగు నంచు నుబ్బి యుబ్బి

గీ. వరుఁడు లేనట్టి యొక ముది వరడునకును
నేం డ్లెనిమిది నిండక మున్నె పెండ్లి చేసి
కొలఁది నాళ్ళకె నన్నొక కుంకఁ జేసి
దనుజ సములైరి నా తల్లి దండ్రు లకట! 32

సీ. పాలు నీళ్ళను బోలెఁ బాయక తగు సతీ
పతుల నొండొరులను బాపినావొ?
తావియుం బూవు చందమున నైక్యముగన్న
దంపతులకుఁ బగల్ దాపినావొ?
చిలుకయుం గొరువంక వలె మైత్రిఁ గల వధూ
వరుల కారాటంబు నెరపినావొ?
ఆత్మయు దేహంబు నందంబు నెనయించు
గువ్వ జంటల కెడల్ గొలిపినావొ?

గీ. తత్ప్రతిఫలంబు సుమ్మిది తప్ప దనుచు
వాంఛిత ఫలమంచు నోదార్పఁ జూతు రిపుడు
తాము చేసిన కార్యంబుఁ దలఁప బోక
తగవు మాలిన నా తల్లిదండ్రు లకట! 35

సీ. కలికి పల్కుల రామచిలుక జంటను బాపి
పంజరంబుల బాధ పఱచినావా?
కవ గూడి పొల్చు జక్కవ జత నెడఁ బాపి
పటుతరం బగు బాధ పఱచినావా?
ప్రియముమై విహరించు పిక యుగంబును బాపి
పాపం బనక బాధ పఱచినావా?
మధు వాని క్రీడించు మధుపద్వయముఁ బాపి
పదటునఁ గడు బాధ పఱచినావా?
గీ. తమినిఁ గవగూడు కలరవ దంపతులను
బాపి దయమాలి బలుబాధ పరచినావొ?
తత్ఫలం బిది కుడువక తప్ప దనుచుఁ
దల్లి దండ్రులె యిప్పు డోదార్తు రకట!

సీ. భర్తను గోల్పోయి పలవించు కామినిఁ
జెలఁగి నవ్వుచు గేలి చేసినావొ?
నాథునిఁ బాసి ఖిన్నత నొందు కాంతను
గాంచి మేలంబుఁ గావించినావొ?
పతి విడ నాడిన పద్మాక్షి నీక్షించి
కూడని యెకసక్కె మాడినావొ?
ప్రాణనాథుని పొందుఁ బడయ నేరక కుందు
నబలను హేళన మాడినావొ?

గీ. ఇంక నెవ్వరిఁ జూచి గర్వించినావొ?
ప్రాగ్భవంబునఁ దద్ఘోర పాప మిట్లు
ప్రాణనాయకు బొందెడ బాపె ననుచుఁ
దల్లి దండ్రులె యిప్పు డోదార్తు రకట! ౪౦

సీ. ధనముకై యాశించి యనురాగ లతఁ దుంచి
తనయ నమ్మిన తల్లి దండ్రులార!
ఇరు వైపులను లంచ మిరవుగాఁ గొని వధూ
వరులఁ గూర్చిన రాయబారులార!
పప్పు భోజనములపైఁ బ్రీతిఁ గైతవ
ప్రియము లాడిన పెండ్లి పెద్దలార!
బహుమతులై యుండి బహుమతుల్గోరి మృ
షోక్తుల్ వచించిన జోస్యులార!

గీ. అసుర సములార! నిర్దయా స్వాంతులార!
శఠ హృదయులార! నాపాలి శత్రులార
కారణం బీ బెడందకు మీరె కారె?
చలము తీరెనె? మీ కనుల్ చల్ల వడెనె? ౪౧

సీ. సోముఁ గేరెడు లేఁత మోమునఁ గస్తూరి
రేఖ పోయి విభూతి రేఖ వచ్చె
తళతళ లీను నిద్దంపు గాజులు పోయి
కేల మోడైన పట్టీలు వచ్చె

మృదువైన వన్నె చీరెలు పోయి నెమ్మైన
ముదుకనూల్ సైను దోవతులువచ్చె
గళమున భూషణావళి పోయి తులసి మా
లికలు రుద్రాక్ష మాలికలు వచ్చె
ఆ. కలికి క్రాలుఁ గన్ను గవను నీలంపుఁ గ
జ్జలము పోయి యశ్రు జలము వచ్చె
బాధ లెన్నఁ దరమె? బాల్య వైధవ్యంబు
దుస్సహంబు మిగుల దుస్సహంబు! ౪౨

సీ. ముప్పొద్దుఁ గడు పార భుజియించు టది మాని
యేక భుక్తమున గృశింప వలసె
అనుపమ భోగంబు లనుభవించుట మాని
భోగులఁ బొడఁ గాంచి పొగల వలసె
శుభ శోభనంబులు చూడఁ బోవుట మాని
తీర్థ యాత్రల కంచుఁ దిరుగ వలసె
మృదు పుష్ప శయ్యల మేను జేర్చుట మాని
బండ నేలల యందె పండ వలసె
గీ. చందనాది సుగంధ చర్చలను మాని
కాయమున బూది పూఁతలు పూయ వలసె
నిట్టి కష్టంబు లెట్టు సహింతు నకట!
బాల్య వైధవ్య మతి దుఃఖ భాజనంబు! ౪౩

సీ. రంగు చీరెల ననురాగంబు పోలేదు
మల్లుచీరెల రక్తి మాయలేదు
పూల చీరెలపైని మురువు తీఱగ లేదు
సన్న చీరెల మోజు జాఱ లేదు
జలతారు చీరెల వలపు చెల్లఁగలేదు
మళ్ళచీరెలఁ గోర్కి మళ్ళలేదు
పట్టు చీరెల యందు భ్రమ మానఁగా లేదు
తోపు చీరెలఁ బ్రేమ తొలఁగ లేదు
ఆ. రకరకంబులైన రైకల మీఁదను
మనసు దీర లేదు తనదు సాటి
చెలులు ముద్దినుసుల చీరెలఁ గట్టంగ
నెను గట్టి నేను నైపఁ గలనె? ౮౩
సీ. బండ నేలను నేను బడి యుండఁ బరుపుపై
బండ మీ మనసు లే భంగి నొప్పె
చన్నీళ్ళ నేను మజ్జన మాడ వేన్నీళ్ళ
స్నాన మెట్లోర్చె మీ మానసంబు
నిశ యెల్ల వగలచే నేఁ గృశింపఁగను నే
కరణి వచ్చెను మీకు గాఢ నిద్ర
కొయ్య రొట్టెలు మెక్కి గోడు నేఁ జెందంగ
మృష్టాన్న మెట్లు మీ కిష్ట మయ్యె?

గీ. చిన్న వయసున నుండి మీ జీవములకు
నుస్సురని యేడ్చు ననుఁ జూచు చుండి యకట!
వృద్ధులై యెట్లు సుఖియింప నిచ్చ గలిగె?
దనుజ సములార! యో తల్లిదండ్రులార ! ౭౭

సీ. మల్లి పుష్పములఁ జామంతి పువ్వుల జాజి
విరులను గనుగొన్న తరుణమందు
బచ్చ కర్పూరంబుఁ బండు వెన్నెల మంచి
గందంబుఁ గాంచిన క్షణము నందు
శృంగార వనముల బంగారు నగలను
మేలి చీరెలఁ గన్న వేళయందు
సొగసు శయ్యల జగా వగ గుల్కు చిత్రముల్
జోడ్రికల్ వీక్షించు కాల మందు

గీ. మించు టద్దంబులను దిలకించు నపుడు
బండు టాకులు కన్పట్టు పట్టునందుఁ
బ్రాణనాథునిఁ బాసిన పడతి మనసు
శోక సాగర మగ్నంబు గాక యున్నె? ౭౮

సీ. పెండ్లి వారిండ్లకుఁ బేరంటమున కేగు
మించు బోణులను వీక్షించు నపుడు
విభులకుఁ గపురంపు విడియంబు లందించు
చంచలాక్షుల నిరీక్షించు నపుడుఁ

గురుల చిక్కెడలించి విరుల మొత్తులఁ దాల్చి
కాంచనాంగుల దిలకించు నపుడు
సరస సల్లాపముల్ వరుసతో గావించు
నంచయానల విలోకించు నపుడుఁ

గీ. చిత్తమెరియ నసహ్యంబుఁ జెంది కుంది
విరహ పరితాపమునఁ బుర పురను బొక్కి
సొక్కి తమిఁ జిక్కి తాలిమి దక్కి సుక్కి
పొందు నా వెత నే మనుకొందు నకట! ౪౭

సీ. కడుఁ జక్కదనముచేఁ గంటికింపై నట్టి
పడుచు వారలు కంటఁ బడిన యపుడు
రంగారు శృంగార రసకవిత్వముఁ జెప్పు
రసిక శేఖరులు తారసిలి నపుడు
మధుర భాషలు మేల్ చమత్కారములు గల్గు
జాణలతో గోష్ఠి జరుపు నపుడు
వీనుల విందుగా గానంబు నెరపెడు
ననుపుకాండ్రను గనుంగొనిన యపుడు

తే. పటు బలిష్ఠాంగు లెదుటఁ గన్పట్టునపుడు
కుదురు పాటింతయును లేక చెదరు హృదయ
మెట్టి సంకల్ప మెప్పుడు పుట్టఁ గలదో?
కటకటా! దైవమా! నీవె కావ రావె! ౪౮

సీ. సెజ్జపై నండి లేచిన వేళఁ గన్పడు
నో యంచు నోరల నాదుగుచుందు
పొగుగూరు పైనమై పోవుచో నెదు రేగు
దెంచునోయని సంశయించు చుందు
శుభకార్యములఁ దాము చూడఁ బోయెడు పట్ల
వెంట నేగఁగ జూచి విసుగు కొందు
కూడు గుడ్డయు మాలి కొంపఁ జేరె నటంచుఁ
గోపించి పలుమాఱు గొణుగు కొందు
ఆ. వచన మెంత శుచియు రుచిఁ గల్గఁజేసిన
నేవొ వంక లెంచి యీసడింతు
దయను మాలి తల్లి దండ్రులే పుట్టింట
బాల విధవ బ్రతుకు బ్రతుకు బ్రతుకె? ౪౯

సీ. పతి పాద పద్మముల్ భక్తితోఁ బూజించి
పుడమిపై ధన్యతఁ బొందు టెట్లు?
ముద్దు ముచ్చట దీఱ ముత్తైదువులఁ గూడి
పేరంటమున కింక వెళ్ళు టెట్లు?
బిడ్డలఁ గని పెంచి ప్రేమతో ముద్దాడి
లోచ నోత్సవముగాఁ జూచు టెట్లు?
నా నెచ్చెలి యితండు నా మనోహరుఁ డంచు
జెలులకుఁ జూపించి చెప్పు టెట్లు?

గీ. చుట్టముల యిండ్లలో శుభ శోభనములు
కలుగు వేళల సరి వారిఁ గలసి మెలసి
పోవు టెంకెట్లు? నే నట్టి పుణ్యహీను
రాల నైతిని! యక్కట! యింకేల బ్రతుకు? ౫౦

సీ. తన మనోహరు నింగిత మెరింగి వర్తిల్లు
మెలఁతల కీ యింతి మేలుబంతి
తన యత్తమామలందున బత్తి పచరించు
చర్య కీ బోటి వజ్రాలపేటి
తన బావల మరందులను మన్ననలు చేయు
పనుల కీ కొమ్మ బల్ పట్టుఁ గొమ్మ
తన యాఁడుబిడ్డలఁ దనిపి వాసికి నెక్కు
ముదితల కీ మించుబోణి రాణి

గీ. చుట్ట పక్కాల సురభియై పుట్టినిల్లు
మెట్టి నిలు వన్నె వెట్టె నీ మేటి బొట్టె
యనఁగ మెచ్చంది కాపురం బాచరింప
నోచనైతిని నిర్భాగ్య నీచనైతి. ౫౧

సీ. చుట్టాల యిండ్లలో శుభశోభనము లంచు
నీడుగా జోడుగా నేగు సిరియు
దాంపత్య తాంబూల తరుణంబు లంచు బల్
హరువుగా మురువుగా నరుగు సిరియు

తిరునాళ్ళ దేవుళ్ళ దరిసెనంబు లటంచు
నలువుగాఁ జెలువుగా నడుచు సిరియు
సరిగంగ స్నానాల సమయాలటంచు మేల్
పొలుపుగా బలుపుగాఁ బోవు సిరియు

గీ. బారసా లంచు మరి కన్యధారలంచు
మించు వేడ్కను బీటల మీఁద జేరి
యింపుగా సొంపుగాను బెంపెసఁగు సిరియు
గగన కుసుమంబె నా మనుగడకు నకట! ౫౨

సీ. భోగి నాఁడతి మోదమునఁ దలంటుకొని గో
రంటాకు నిడుకొను నట్టి వేడ్క
మవ్వంబుగాఁ జద్ది బువ్వంబు వేగు జా
మున లేచి ప్రీతితోఁ దినెడు వేడ్క
చెలువారు పండు వెన్నెల బైట జతకత్తె
లను గూడుకొని యాటలాడు వేఁడ్క
ప్రొద్దు పొద్దుననె నోమును నోచి వాయనా
లెలమి నైదువల కందించు వేఁడ్క

గీ. బెడఁగు జడవైచి పువ్వులు ముడిచి జిలుగు
చలువ వలువలు దాల్చి సంజలను వెడలి
హాయిలు మీరంగ నుయ్యాల లూగు వేఁడ్క
యట్లు తగ్గెల నిఁకనెట్టు లనుభవింతు. ౫౩

సీ. పెండ్లికి ముందుగాఁ బెద్దలు నాచేతఁ
　　గావింపఁ జేసిన గౌరిపూజ
పెండ్లికాలమునందు వేదమంత్రాలతోఁ
　　జేసిన ద్విజుల యాశీర్వచనము
మినుకును గుత్తికంటును స్పృశించిన పుణ్య
　　సాధ్వీమణులచేతి చల్లఁదనము
పరిపూర్ణ సౌభాగ్య భాగ్యంబు జాతకం
　　బుల వ్రాసినట్టి జ్యోతిష్యుల వచస్సు
గీ. మోద మిగురొత్త మాయమ్మ మ్రొక్కఁజేయ
　　మించు ప్రేమను నన్ను దీవించినట్టి
　　పెద్దలయుఁ బేరటాండ్రయుఁ బెంపులెల్ల
　　నాయభాగ్యాన వ్యర్థమై పోయె నకట!　　౫౪

సీ. సకల విద్యలయందు శారద యన మించి
　　యెవరి మానసము మెప్పించుదాన
సదన కృత్యముల వైశద్యంబుఁ జూపించి
　　యెవ్వారి మనసు రంజించు దాన
చాతుర్య చర్యలఁ జాకచక్యముఁ జూపి
　　యెవ్వారి మదిఁ గరఁగించు దాన
సరస శృంగార వైఖరులెల్ల వెలయించి
　　యెవరి చిత్తంబుఁ జొక్కించుదాన

గీ. కైతల రచించి సంగీత కలన మెరసి
యెవరి సొగియించుదాన హా! యెల్లఁ జెడియె
నెవరి నలరింప నీ నేర్పు లెల్ల నేర్చి
నానొ? యా వేలిక జగానఁ గానఁ గాన. ౫౫

సీ. మందహాసము! రాకుమా! యింక నావంక
రాకును నీకు ఋణంబు చెల్లె
ఉత్సాహమా! క్రొత్తయునికిని జూచుకో!
యణఁగి యుండఁగ లేవు క్షణికమైన
సంతోసమా! మన సంబంధములు తీరె!
నీ మేనితోడ నిన్నెనయలేను
ఆనందమా! పోతివమ్మ! హా! నను బాసి
రావుగా! జన్మాంత రంబుదాక

గీ. సౌఖ్యమా! నీవు నేనును శతృవులము
పొమ్ము! పోపొమ్ము! మనకింక పొత్తు లేదు!
భోగవైభోగముల కెల్ల మూలమైన
జీవితేశుండె నన్నొంటిఁ జేసెఁ గాన. ౫౬

సీ. కన్న బిడ్డలఁ గూర్చి కరుణ నక్కునఁ జేర్చి
చెక్కులు ముద్దాడి సొక్కు సొగసు
నుయ్యాల లందుంచి యొయ్యారముగ నూచి
జోల పాటలు పాడి సోలు సొబగు

సంజ చాయను జూపి చందమామను జూపి
లాలించి పోర్మాన్ప్ప మేలి హాయలు
గోర్వంక యనిపించి కూనలఁ గనిపించి
ప్రియముమై బువ్వఁ దిన్పించుహావుసు
గీ. లలిత భాషలు వలువ లలంకరించి
యిరుగు పొరుగుల పిల్లల నెనసి మెలసి
యాట లాడంగఁ బాడఁ గాంచి యలరు సొంపుఁ
బడయ నోచని తనువు పాపముల మనువు. ౫౭

సీ. ఎల నవ్వు నవ్వుచు నెలమి మైఁ గేలెత్తు
కొమ్మని యెత్తుచోఁ గ్రొత్తనలువు
లీలతోఁ దన యంత లేచి సారెకు నేల
విద్దెముల్ సేయుచో ముద్దు చెలువు
లలి మీఱ నల్ల నల్లనఁ దప్పటడుగులు
వేయు నప్పుడు తోఁచు వింత మురువు
తొక్కు పల్కులు తేనె తొలుకంగఁ బలుకుచోఁ
గనుపట్టు నట్టి యక్కజంపు హారువు
గీ. కన్న బిడ్డలకడఁ దన గన్నుఁ దోయి
కఱవు దీఱఁగ మగనితోఁ గాంచలేని
పతిత యగు నన్ను వంటి నిర్భాగ్య బాల
విధవ జన్మంబు పృథివిపై వృథయె గాదె? ౫౮

సీ. తల్లియే దాయఁగాఁ దలపోయు చుండఁగఁ
దండ్రియే నిర్దయత్వంబు దాల్ప
నన్నలే పలుమాఱు లాగ్రహించుచు నుండఁ
దమ్ములే యలఁతిగాఁ దలఁచుచుండ
వదినెలే చలపట్టి యదలించు చుండఁగా
మఱదండ్రి మర్యాద మాని యుండ
జెలియండ్రు మన్నన సేయ కేమరి యుండ
నక్కలే పరుషంబు లాడుచుండ
గీ. నన్నిటికి సైచి పగలు రే లనక యోర్మిఁ
గూర్మి కనుపట్టఁ బుట్టింటఁ గూటి కొరకు
గుడ్డ కొఱకును బానిస కూతులట్లు
బాల విధవలు పడు పాట్లు బ్రహ్మ కెఱుక!

సీ. చిత్రేశ్వరుని రూపుఁ జిత్రంబునను వ్రాసి
మెప్పించి పొందెదు మేటి సుఖము
ప్రాణేశ్వరుని మీఁదఁ బద పద్యములుఁ గూర్చి
యలరించి పొందెదు నమిత సుఖము
కాంతుని కడ నగ్న గర్భ సూక్తులు పల్కి
కరఁగించి పొందెదు పరమ సుఖము
చెలువుని చెంత నంచిత విలాసము చూపి
వలపించి పొందెదు వర సుఖమ్ము

ఆ. విభుని సరస మిగుల విన్నాణముల నొప్పు
కుట్టు పనులఁ బూస గ్రుచ్చు పనుల
నైపుణముల నెల్లఁ జూపి చొక్కించుచు
పొందు సుఖ మదెంత పుణ్యవతికొ? ౬౦

సీ. ఆఁడు జన్మం బెత్తి గోడుఁ జెందుట కంటె
నగమొ పాషాణమో యగుట మేలు
పుడమి వేల్పుల యింటఁ బుట్టి వొందుట కంటె
నడవిలోఁ బెద్ద మ్రానగుట మేలు
ముసలి పిశాచికి ముగుద యగుట కంటెఁ
బ్రహ్మచర్యము తోడి బ్రతుకు మేలు
బాల వితంతువై వగచు చుండుట కంటె
యోగినినై కాన నుంట మేలు

గీ. పొట్టకును బట్టకును జేరి పుట్టి నింట
బానిసల రీతి రేలును బగలు ననక
పనులు సేయుచుఁ బలుపాట్లు పడుట కంటెఁ
దటుకున విషంబుఁ ద్రావి చచ్చుటయె మేలు! ౬౧

సీ. అత్యంత దారిద్ర్య మనుభవింపఁగ వచ్చు
బాల వితంతువై బ్రతుక రాదు
బలు రోగములచేత బాధ లందఁగ వచ్చు
బాల వితంతువై బ్రతుక రాదు

పరమ కురూపిణియై భరియింపఁగా వచ్చు
బాల వితంతువై బ్రతుక రాదు
సేవా ప్రవృత్తిచే జీవింపఁగా వచ్చు
బాల వితంతువై బ్రతుక రాదు

ఆ. పాపజాతి యగుచు బ్రతుకంగ వచ్చును
బాల విధవ యగుచు బ్రతుక రాదు
మతి విహీన యగుచు బ్రతుకంగ వచ్చును
బాల విధవ యగుచు బ్రతుక రాదు. ౬[illegible]

సీ. కాలి యందియలును గడియాలుఁ దీయంగఁ
దలఁచు చో నెమ్మేను జలదరిల్లి
నిగనిగ ల్మిఁచు బల్ నిడుద పెన్నెఱి గుంపు
ఖండింప నెంచుచోఁ గంప మొంది
కాంతుల నీను చొక్కంపుఁ జే గాజులు
పొడిసేయఁ బూనుచో నొడలు మఱచి
గళమున వ్రేలు చక్కని పుస్తెఁ బుటుకునఁ
దెంపం గడంగు చో స్పృహను దప్పి

గీ. సన్న పుట్టంబు నెడలించి సైను బట్ట
గట్టఁ జేయుచోఁ బ్రాణంబు కడను బట్టి
కాంత లుండంగ దయమాలి కన్నవారె
వికృత రూపిణిఁ గాఁగఁ గావింతు రకట! ౬[illegible]

సీ. సన్న కుంకుమ రేక సున్నయైన మొగంబు
పవలింట చంద్రబింబంబు గాదె?
ఒసపరి నగ లెల్ల నూడ్చిన నెమ్మేను
పూవులు గోసిన తీవ గాదె?
నూనె రాయక యున్కి నునుపు దక్కిన నెఱుల్
చమరీ మృగంబు వాలంబు గాదె?
జాలు వారెడు నశ్రుజలముఁ గల్గిన కనుల్
మంచునఁ దోఁగు తామరలు గావె?

గీ. గద్గదిక దోఁపఁగాఁ బల్కు కల్కి పల్కు
వికృత వాసంతి కేతర పికము గాదె?
మోదమును దక్కి భూ భోగములను రోయు
బాల విధవయె జీవ చ్ఛవంబు గాదె? ౬౮

సీ. నిత్య శృంగారంబు నిష్ఫలం బై పోయె
నుదయ కుంకుమమును బదటఁ గలసె
కాటుక గారి బల్కానల పా లాయె
కన్య తులసి కొఱగాక పోయె
మోచేతి పద్మంబు మొదల వ్యర్థం బాయె
చల్ల చుక్కయు మేలు సలుప దాయె
వర లక్ష్మియైన నాపదఁ బాప రాదాయె
చిట్టి బొట్టు వ్రతంబు చెట్లఁ బట్టె

ఆ. తద్దె నోములైనఁ దప్పింప లేవాయె
భారమైన యీ విపత్తు నుండి
నోము లెందునైన భాములఁ బాపునే?
బాల నగుట జేల పడితిఁ గాక! ౬౫

సీ. దయ లేని వారలఁ దలి దండ్రులుగఁ జేయ
దైవమా! నాయందుఁ దప్పు గలదె?
కడు బీద బాపల కడుపునఁ బుట్టింప
దైవమా! నాయందుఁ దప్పు గల దె?
ముసలి యన్ మొసలికి ముదితను గాఁ జేయ
దైవమా! నాయందుఁ దప్పు గలదె?
పసి తనంబుననె నా పతినిఁ జంపుక పోవ
దైవమా! నాయంఁదుఁ దప్పు గలదె?

గీ. జోడు వీడక నాయీడు జోడు చెలులు
వేఁడుకల వెల్లిలో నోల లాడుచుండ
జోడు గూర్పక నన్ను విజ్జోడు జేయ
దైవమా! దీన నాయందుఁ దప్పు గలదె? ౬౬

సీ. బొమ్మలతోఁ గూడి బొమ్మల పెండ్లిండ్లు
చిత్తంబు రంజిల్లఁ జేయ లేదు
వండి గుజ్జన గూళ్ళు వరుస బంతులు తీర్చి
మించుభోజనులకు వడ్డించ లేదు

వియ్యంపురాండ్ర తో నెయ్యంబు రెట్టింపఁ
దూఁగు టుయ్యాలలం దూగ లేదు
పసపుఁ గుంకుమయును బదిమంది చెలులకు
వేడుకతోఁ బంచి పెట్టలేదు
గీ. వక్క లాకులుఁ జేఁ బూని యొక్కనాఁడుఁ
జక్కఁగా వీడియంబును జలుప లేదు
కటకటా! దయ్యమా! యింత కరుణలేక
సతుక మంతయు నిప్పుడే కూల్పఁ దగునె? ౬౭
సీ. అచ్చనగాయ లప్పచ్చులు నల్లో నే
రేములుఁ జెలులతో నాడ లేదు
ఆలంకిగుడి యంజి యాలకూఁతలు నీదు
జోడు చేడెలతోడ నాడ లేదు
కను మూసి గంత నల్ గంబాల యాటలు
వేడుకతోఁ గూడి యాడ లేదు
ఒప్పుల కుప్పలు నోమనఁ గుంటలుఁ
దోడి బాలికలతో నాడ లేదు
గీ. గోడి పట్టెలు గొబ్బిళ్ళు నాడలేదు
తక్కఁ గల్గిన క్రీడలఁ దనివి దీఱ
నాడ లే దాయె నామేలు చూడలేక
మూల దయ్యము? నన్నిట్లు మూలఁ ద్రోతె! ౬౮

సీ. పండుగనాఁడైన నిండు వేడుకతోడ
బట్టుపుట్టంబులఁ గట్టలేదు
మవ్వంబుగాఁ గురుల్ దువ్వి బల్ హొయలుగా
జడవైచి పువ్వులు ముడువలేదు
ఇరుగు పొరుగువారి వెరవు తెచ్చుకయైనఁ
దగు నగల్ మైనిండఁ దాల్పలేదు
తోయంబువారలతోఁ గూడి పేరంట
మునకైనఁ బలుమారు చనఁగలేదు
గీ. కోర్కు లేవియుఁ దీఱని కూన నాకు
హెచ్చు వైధవ్య దుఃఖంబుఁ దెచ్చిపెట్టి
వెతలఁ గుడుచుచు నీరీతి బ్రతుకు మనుట
ధర్మరక్షక! నీకిది ధర్మమయ్య! ౬౯
సీ. అత్తవారింటనే యణఁగి యుండుద మన్న
నాగోడుఁ జూడ రనాథ నగుట
కన్నవారలయింటి కడ కేగుద మటన్న
లెన్నగా వారికే లేదు తిండి
బంధువు లిండ్లలోఁ బడియుంద మని యన్న
నౌ, యన్నవారు కానంగరారు
నగలు మార్చుక జీవనంబు సేయుదమన్న
శుల్కవిక్రీత కేసొమ్ములుండు?

గీ. ఇంక నెందుల కేగుదు? నెవరు దిక్కు?
జీవయాత్రకు నాకెద్ది త్రోవ? యకట!
బ్రతుకఁజాలను ననుఁగూడ భర్త కడకు
దయను గొని పోవఁగదవయ్య! ధర్మమూర్తి! ౨౦

సీ. అమ్మరో! మీపుణ్య మయ్యె! మీదయ యంచుఁ
బెఱవారిఁ జాల సేవింపఁజాల
చేఁ జాచి చెంగుఁజాచియును దేహి యటంచుఁ
దీనతఁ జాలఁ బ్రార్థింపఁ జాలఁ
"అనద ననాథ నన్నాదరింపరె"! యంచుఁ
గృప పుట్ట జాలఁగ ను య్యెడఁగఁజాల
"గతి లేద టంచు సిగ్గతి" "మీరె గతి!" యంచు
వెతలెల్లఁ జాల విన్పింపఁ జాల

గీ. పరుల కొంపలలోఁ జేరి పనులు సేసి
దాసివలె హేయముగఁ బొట్ట పోసికొనుచు
బ్రతుకఁజాలను గతిలేని పతిత నన్ను
దెంపునను జంపుకొనిపోవె! దేవదేవ! ౨౧

సీ. ఫలమును రుచియును గలసి యుండెడు రీతి
విభుఁడు నేనును గూడు వేడుకయును
సుమము మరందంబు నమరి యుండెడు భాతి
వరుఁడు నేనును గూడు వైభవమును

వాక్కునా నర్థంబు వఱలు చుండెడు భంగిఁ
బతియు నేనును గూడఁ బండువయును
చదురింద్రుఁ జంద్రిక జాను మీాఱెడు మాడ్కి
సఖుఁడు నేనును గూడ సంతసమును
గీ. మాలదైవము! యీాజన్మ మధ్యమందు
నాకు లేకుండఁ జేసి యన్యాయముగను
బాధఁ బెట్టెద వేమి లాభంబు నీకు?
నబల ననియైన జాలి లేదాయె నకట! ౭౨

సీ. రమణుండు దేశాంతరమునుండి యంపిన
క్షేమలేఖను జూచి చెందు ముదము
మగఁడు విదేశసీమల కేగుదెంచి వ
చ్చిన వేళ వీక్షించి చెందుముదము
ధవుఁ డన్యపుర నికేతనుఁడైనచోఁ దన
సేమంబువ్రాయుచోఁ జెందుముదము
నాథుండు పరపట్టణమునుండి సొమ్ములు
చీరలు నంపుచోఁ జెందు ముదము
గీ. పొందఁ జాలని నావంటి మందభాగ్య
రాలి జీవన మెన్ని చందాలనైన
వృథయె? కావున నన్ను నా విభునికడకుఁ
దెగువఁ గొనిపోవఁ గదవయ్య! దేవదేవ! ౭౩

సీ. కప్పురంపు విడెంబుఁ గాంతున కిచ్చుచో
హస్తసంస్పర్శచే నమరు సుఖము
నెలమి మనోహరుం డేకాంతమాడుచో
నాస్యసంస్పర్శచే నమరు సుఖముఁ
బవళించునతఁ బదాబ్జాతమ్ము లొత్తుచో
నంఘ్రిసంస్పర్శచే నమరు సుఖముఁ
జంకబిడ్డను బ్రాణసఖున కందించుచో
నంగసంస్పర్శచే నమరు సుఖము
గీ. నొందఁ జాలని నావంటి మందభాగ్య
రాలి జీవన మెన్ని చందాలనైన
వృథయె కావున నన్ను నా విభునికడకు
దయను గొనిపోవఁ గదవయ్య! ధర్మమూర్తి! ౭౪

సీ. హస్తాబ్జమునఁ జెక్కుటద్దంబు గీలించి
బ్రతుకు నేగర్భనిర్భాగ్యరాలు?
అంగుళీకంబు నాసాగ్రంబునను జేర్చి
బ్రతుకు నేఘోరపాపాత్మురాలు?
ఈక్షణంబును భూతలైక లక్ష్యముఁ జేసి
బ్రతుకు నేపరమదుర్మార్గురాలు?
విమనస్కయై లోక విభవంబులను రోసి
బ్రతుకు నేమరదృష్టవంతురాలు?

గీ. అట్టి బాలవితంతువు నవనియందు
లేకయుండంగఁ జేసిన లోకమునకు
లోటు రాబోదు సత్కృప లోఁదలంచి
ధవునితోఁ గూర్పవే! నన్ను ధర్మమూర్తి! ౮

సీ. కంటికి నేల కొక్కటె ధారగా నశ్రు
జలము లోడ్చెడు పాపజాతి యెవతె?
మోకాలిమీఁద మోమునుదీయక వియోగ
సంతప్తయగు పాపజాతియెవతె?
సారెకు వేఁడి నిట్టూరుపుల్ నిగుడించి
ఘాత లెంచెడు పాపజాతి యెవతె?
నేల రాయుచుఁ గాలివేళ్లితో బ్రతుకుపై
రోఁత నొందెడు పాపజాతి యెవతె?

గీ. అట్టి బాలవితంతువు నవనియందు
లేక యుండంగఁ జేసిన లోకమునకు
లోటు రాఁబోదు సత్కృప లోఁదలంచి
ధవునితోఁ గూర్పవే! నన్ను ధర్మమూర్తి! ౮౬

సీ. ప్రాణిహింసయె మహా పాతకం బంచును
బోధించి మాన్పిన బుద్ధమూర్తి!
అబలల దుఃఖంబు లణఁపజూచిన దయా
శాలి శ్రీయక్బరు చక్రవర్తి!

సహగమనంబు దుష్టాచారమని మాన్పి
నట్టి శ్రీరామమోహన సుకీర్తి!
విధవా వివాహంపువిధిఁ దెల్పినట్టి వి
ద్యాసాగరేంద్ర! ధర్మానువర్తి!

గీ. దైవసములార! యో మృతజీవులార!
భవ్యమూర్తులార! మహానుభావులార!
స్వస్థులైతిరె! యకట! మాపాపమునను
మీరలేయున్న మావెతల్ దీఱకున్నె? ౨౨

ఫలమేమి? సుజ్ఞాన కలికల సృజియించి
సౌభాగ్యమును వ్రాయఁ జాలవేని
రహియేమి? సౌందర్య లహరుల సృజియించి
సౌభాగ్యమును వ్రాయఁ జాలవేని
పసయేమి? సుప్రభా భాసల సృజియించి
సౌభాగ్యమును వ్రాయఁ జాలవేని
రసమేమి? శృంగార రాసుల సృజియించి
సౌభాగ్యమును వ్రాయఁ జాలవేని

గీ. ప్రతిభ గలవాఁడవఁట మంచి చతురుఁడవఁట!
ఖ్యాతికినిఁ దగ్గ చేతలే? ధాత! నీకు
మొదలె ఛాందసుఁడవు గదా! ముదిమి మదియె
చెడెనో? మాయమ్మ శారద చెప్పలేదొ? ౨౩

సీ. అఖిల లోకముల కిష్టార్థంబులిచ్చి నీ
తల్లి శ్రీలక్ష్మి రంజిల్లుచుండ
ఆపదోద్ధారకుండై దయాళుండు నీ
తండ్రి చక్రధరుండు తనరుచుండ
సరసుండు సుకుమారి స్మరుఁడు నీతమ్ముండు
మిధునంబులను గూర్చి మెరయుచుండ
ఆశ్రితావలికి విద్యాబుద్ధులిచ్చి నీ
దేవి వాగ్దేవి వర్ధిల్లుచుండ

గీ. ఆల్మగల నెడఁబాపి సౌఖ్యముల జోపి
శోకముల బాపెదవె! దయాశూన్యహృదయ!
తెలియవోగాక యీ కొలదీగుదాక
నీ కపూజ్యతసుమ్మ! నాళీకజన్మ! ౭౯

సీ. వేల్పుల పెద్దవై వెలసినట్టి ఫలంబు
జన్నిగట్టై వన్నెఁగన్న ఫలము
చదువుల వేల్పువై చవురుఁ గన్న ఫలంబు
బంగారు బొజ్జ చెలంగు ఫలము
సత్యలోకము నేలు సౌరు గన్న ఫలంబు
చతురాననుఁడవై యొసంగు ఫలము
జాతకంబులు వ్రాసి ఖ్యాతిఁగన్న ఫలంబు
భారతీశ్వరుఁడవై పరగు ఫలము

గీ. యువతుల ననాథలను జేసి యుసురువెట్టి
నిష్ఫలముఁ జేయుచున్నావు నిజము నీవు
నలిననాభుని నాభినే నెలసినావొ?
నాభినే పుట్టినావొ? ఓనాభిజన్మ! ౮౦

సీ. ధీమంతులార! సుధీంద్రులారా! యతి
బాల్యవివాహమున్ బాపరయ్య!
కవిరాజులార! సత్కర్ములారా! యతి
బాల్యవివాహమున్ బాపరయ్య!
సదయహృదయులార! సరసులారా! యతి
బాల్యవివాహమున్ బాపరయ్య!
నాగరక జన రత్నంబులారా! యతి
బాల్యవివాహముఁ బాపరయ్య!

గీ. కాశ్యపీసుర రాజన్య వైశ్య శూద్రు
లార! పుణ్యాత్ములార! యీ ఘోరదుఃఖ
భాజనము నతిబాల్య వివాహమింకఁ
బాపరే! పాపఁగదరయ్య!! పాపరయ్య!!! ౮౧

సీ. ఆలినిఁ గోల్పోయి యాత్మకన్యలమార్చి
మరలఁ బెండ్లాడు కాపురుషులార!
నగలకై కూఁతుండ్రఁ దెగనమ్మి సిగ్గతి
కలిచెడు గయ్యాళి కొమ్మలార!

అల్లుండ్రయిండ్లెల్ల గుల్లలు గావించి
యప్పు దీర్చుకొను నీచాత్ములార!
నరమాంస మమ్మి ధనముఁగూర్చి గర్వించి
చరియించు లుబ్ధకజనములార!

గీ. వృద్ధధనికులకు సుతల నిచ్చి వారి
మృతికిఁ గాచుక యుండెడు హీనులార!
ఆత్మకార్య ధురంధరులార! మీకు
మంచి కాదిది! యిఁకనైన మానరయ్య! ౫౨

సీ. కులకాంతతోఁ గూడి కులికెడు వానికి
విధురుని చింత లే విధిసిఁ దెలియుఁ
దులలేని సిరులతోఁ దులదూగు వానికి
నిరుపేద కష్ట మేకరణిఁ దెలియు
స్వాతంత్ర్య భూతి విస్ఫీతుఁడౌ వానికి
బానిస బెడఁద లేభాతిఁ దెలియు
భూసురుఁడై పుట్టి మురిసెడు వానికి
మాలని దోసఁగు లేమాడ్కిఁ దెలియుఁ

గీ. బ్రాణపతితోడ సుఖియించు భాగ్యవతికి
బాల విధవల దుఃఖ మేభంగిఁ దెలియు
నింగిత జ్ఞాన మించుకంతేని లేక
నోటికొలఁదులు నుడువుచున్నారు గాక. ౫౩

సీ. అకటా! "పరోపకారార్థంశరీర" మన్
మాటఁ దలంచుఁడో మాతలార!
వాత్సల్యమున "నాత్మవత్సర్వ భూతాని"
యనుపల్కు నెంచుఁడో యవ్వలార!
సదయాత్ములై "యహింసాపరమోధర్మ"
యనుసూక్తి భావించుఁ డంబలార!
నిరతంబుఁ "బాపాయ పరపీడన" మ్మంటఁ
దగ విచారించుఁడో తల్లులార!

గీ. బాలికల నిట్లు దుఃఖాబ్ధి పాలుచేయు
పురుషులకుఁ గష్టసుఖములు బోధచేసి
శిశువులకు బొమ్మపెండ్లిండ్లు చేయకుండ
నడ్డు పడరమ్మ! మీరైన నమ్మలార! ౬౪

సీ. జాత్యభిమానంబు సర్వంబు విడనాడఁ
దగవుగాఁ దోఁచెనే మగువలార?
కన్నబిడ్డలమీఁద కరుణను విడనాడఁ
జెల్లునే యిటు మీకుఁ జెలువలార?
దయహీనలై భూతదయ వీడనాడంగ
ధర్మమార్గంబౌనె తరుణులార?
స్వప్రయోజన పరత్వమునఁ గన్నెల నిట్లు
హింసింపఁ బాడియే యింతులార?

గీ. కన్నతల్లులె పిల్లలఁ గావకున్న
దిక్కు వేఱెక నున్నదే తెలుపలార?
వ్యాఘ్రములకన్న ఘోర సర్పములకన్నఁ
గ్రూరమతులైతి రేమమ్మ? కొమ్మలార! ౯౫

సీ. ఆడువార లనంగ నస్వతంత్రు లటంచు
వాదులాడుట వట్టి సోదిగాదె?
ఆడుదే గృహరాజ్య మరలేక పాలించు
రాణి యంటయె సత్యవాణిగాదె
ఆడుది గట్టిగా ననుకొన్న కార్యంబు
జరుగని దొక యుదాహరణ కలదె?
ఆడుదానిష్టంబు ననుసరింపక యింటి
వాఁడు చేసెడి దొక్క పనియు గలదె?
గీ. ఆడువారల కష్టంబు లాడువారె
చూడకుండుట మానోము సొంపుగాదె?
గట్టిగా మీరు తలఁచిన గడియలోనె
తప్పవే మాకు కష్టాలు తల్లులార! ౯౬

సీ. కన్నబిడ్డలనమ్మి కడుఁ బాతకముఁ గట్టు
కొనఁబోకుడయ్య మోయనఘులార!
పసిపాపలను బట్టి ముసలివారికిఁ గట్టి
యలయింపఁబోకుఁడో యయ్యలార!

పుత్రికలను గూడ బుత్రుల (గనుజూడ
దయతోడఁ జూపుఁడో తండ్రులార!
నోరుమాలిన నిసుంగుల నేచిన యుసురు
తగులకతప్ప దోసుగుణులార!

గీ. బాలవిధవలు నిత్యంబుఁ బడెడి పాట్లు
నుంత తలపోయుఁడయ్య! యోసుజనులార!
మాగతియె మీకుఁ బట్టిన మదికి నెట్టు
లుండునో యెంచుఁడమ్మ! యో యువతులార! ౮౨

మన దేశ జనసంఖ్య ఘన వృద్ధిఁ గనకున్న
హేతువ దేమొ యూహింపరయ్య?
పరదేశములలోని ప్రజ లసంఖ్యాకులై
సుఖియించు కత మేమొ చూడరయ్య?
ఆఁడువారల వీడ నాడినచో సంఘ
బలము తగ్గునో లేదో తెలియరయ్య?
చిరవియోగంబున జీర్ణింప స్త్రీలోక
మౌన్నత్య మెటులబ్బు నరయరయ్య?

గీ. పురుషులును స్త్రీలు నైక్యంబుఁ బొరయకున్నఁ
బూజ్యమైన స్వాతంత్ర్య స్వారాజ్యములను
బడయు టెట్టులో మీరలే నుడువరయ్య?
పుణ్యజనులార! భారతపుత్రులార! ౮౮

సీ. సీత తా నెంతటి పూతచరిత్రయో?
ద్రౌపది యెంత విద్వాంసురాలో?
సావిత్రి యెంతటి సద్గుణవతియొక్కో?
విదుల తా నెంతటి వీరమతియొ?
సుమతి తా నెంతటి శుద్ధచరిత్రయో?
సత్య యెంతటి సాహసాత్మురాలో?
దమయంతి యెంతటి ధైర్యసమేతయో?
చంద్రమతి యదెంత సాధ్వియొక్కో?

గీ. అంతవారల మముఁ జేయరయ్య! రాజ
కీయములతోడ నాత్మ సాంఘికములెల్ల
సంస్కరించుట లెస్స యేసరణినైన
మాన్యులార! స్వదేశాభిమానులార!

సీ. కాంతామణుల వేఱుగా గణించుట స్వదే
శాభిమానులకు న్యాయంబు కాదు
అనదల యాపద లణఁపకుండుట స్వదే
శాభిమానులకు భావ్యంబు కాదు
అర్ధాంగు లగు స్త్రీల నసదు చేయుట స్వదే
శాభిమానులకు శ్రేయస్సు కాదు
స్త్రీల బానిసల రీతినిఁ దలంచుట స్వదే
శాభిమానులకు మాన్యంబు కాదు

గీ. స్త్రీల బాసట లేకున్న దేశ మెపుడు
నున్నతికి రాదు కావున యువతిమణుల
గోడుడిపి మీఁదఁ గాలానుకూలకృతికిఁ
బూనఁగదరయ్య! దేశాభిమానులార! ౯౦

కూర్మిమై మీ బాగుఁ గోరువారము గాని
చలము సాధింప శత్రులముగాము
పనిపాటులందుఁ దోడ్పడెడువారముగాని
యలయింపఁగాఁ జెనంటులముగాము
పురుడింప మీతోడఁ బుట్టువారముగాని
వెలిఁ జేయ లాతివారలముగాము
భాగ్యభోగ్యముల మీపాలివారముగాని
తలపోయఁ దేరవారలముగాము

గీ. తెగువజూపక మామీఁది పగనువిడిచి
సాదరంబున మముగాంచి సమత నెంచి
కరుణ మదినుంచి మమ్ములఁ గావరయ్య!
పురుషవరులార! యోపుణ్యపురుషులార! ౯౧

భ్రూణహత్యల మాన్ప పుణ్యంబు లభియించుఁ
గూనల పెండ్లిండ్లు మానరయ్య!
పుత్రిదానముఁ జేయు పుణ్యంబు లభియించుఁ
గూనల పెండ్లిండ్లు మానరయ్య!

పురుషభిక్షముఁ బెట్టు పుణ్యంబు లభియించుఁ
గూనల పెండ్లింప్లు మానరయ్య!
పాలతూల బ్రతికించు పుణ్యంబు లభియించుఁ
గూనల పెండ్లింప్లు మానరయ్య!
గీ. అకట! పిచ్చుకపైఁ జంద్రహాసమట్టు
లబలలము మీకు మాపయి నలుక యేల?
మమ్ముఁ గరుణించి చేపట్టి మనుపరయ్య!
పురుషవరులార! యో పుణ్యపురుషులార! ౯౨

సీ. నిండారు దయతోడ నిలువనీడలుగాగ
శరణాలయంబు లేర్పరుపరయ్య!
హృద్యవిద్యలనేర్పి వృత్తులఁ గల్పించి
జీవనోపాధులఁ జేర్పరయ్య!
పరిణయవాంఛచేఁ బరితపించెడువారిఁ
గోరిన వరులతోఁ గూర్పరయ్య!
శమదమాదులఁ దపశ్చర్యఁ బూనినవారిఁ
బెంపారు భ_ఁ బూకింపరయ్య!
గీ. దైవదత్తంబులైన స్వాతంత్ర్యములను
భోగభాగ్యంబులను సమభాగమిచ్చి
సోదరీరత్నములనెల్ల నాదరించి
పుణ్యకీర్తులఁ గొనరయ్య! పురుషులార! ౯౩

సీ. దేశంబు మిగుల వర్ధిలి చక్కఁగా శుభో
దయమంద మదులందుఁ దలఁతు రేని?
మేదిని సారసమృద్ధిమై లెస్సగా
ఫలియింప మదులందుఁ దలఁతు రేని?
కాటకంబు మశూచికముఁ గలరా ప్లేగుఁ
బొలియంగఁ మదులందుఁ దలఁతు రేని?
కుంభవృష్టిగ సదా గోవులు పాలీయ
నెలమితో మదులందుఁ దలఁతు రేని?

గీ. బాల్యవైవాహికములను బాపరయ్య!
బాలవిధవలకన్నీరు పడినయంత
వఱకు దేశంబు లేశంబు బాగుపడదు
కాన బాల్యవివాహముల్ మానరయ్య! ౯౪

సీ. అమ్మరో! నాపెండ్లియగు టెన్నఁడే యన్న
కూఁతుమాటలు విని కుంది కుంది
అవ్వరో! నామగండెవ్వరో చెప్పుమన్న
వలవలకన్నీరు వంచి వంచి
మగఁడువచ్చునె! చాలనగలు తెచ్చునె! యన్న
పలుకులాకర్ణించి వగచి వగచి
వాయనంబున కల్లవారియింటికిఁ దోడ
నేగుదెంచెదనన్న నేడ్చి యేడ్చి

గీ. తనయ యవ్యక్తవాక్యముల్ దలఁచి తలఁచి
యక్కటా! యంచు హా! దైవమా! యటంచు
వనఁటనొంది యలో! హాలో! యనుటకంటెఁ
గూనలకుఁ బెండ్లిసేయుట మానరాదె? ౬౫

సీ. కల్యాణవేళ మంగళసూత్రమును గట్టు
తరుణంబునందు సీతాయి మగఁడు
సాపడకున్కి స్థాలీపాక మొనరించు
తఱియందె యల్ల చంద్రమ్మ మగఁడు
పాకెన్న నాఁడు సంభావనల్ విప్రమం
డలి కిచ్చువేళ మీనాక్షి మగఁడు
నాకబలియొనర్చు నాఁటి సంకల్ప మా
రంభించునపుడె భద్రాంబ మగఁడు

గీ. పదియు నాఱవ పండుగ గదియమున్నె
దేవదేవిమగండు గతించెననుచు
నురములను మోఁదుకొనుచు వందురుటకంటెఁ
గూఁనలను వృద్ధులకు నీయమానరాదె? ౬౬

సీ. పేదరైతుల నేడిపించు దుష్టోద్యోగి
కొనఁడొకో? వందలకొలఁది ధనము
పడుపుఁదనంబుచే గడనకెత్తియలెల్లఁ
గూడఁ బెట్టరె? వేలకొలఁది ధనము

కటికితనంబుచే గాయికసాయీలు
కూర్చిరో? లక్షలకొలఁది ధనము
దారులుగొట్టి బల్ దారుణగతి దొంగ
కొనిపోఁడొకో? కోట్లకొలఁది ధనము
గీ. కీర్తికినిఁగాని ధనమేల? కిల్బిషాగ్ని
కింధనంబును నిహపరబంధనంబు
దంధనంబట్టి ధనముకై తగవుమాలి
కూనలను విక్రయింతురే? కుమతులార! ౯౭

సీ. బాలవితంతు దుర్భర దుఃఖమును విన్న
గండశైలంబైనఁ గరఁగకున్నె?
బాలవితంతు దుర్భర దుఃఖమునువిన్న
బోయకైనను జాలిపుట్టకున్నె?
బాలవితంతు దుర్భర దుఃఖమును విన్న
గటికివానికి దయ కలుగకున్నె?
బాలవితంతు దుర్భర దుఃఖమునువిన్న
ఖలుడైనఁ గన్నీరు గార్చకున్నె?
గీ. మెత్తపడకున్న దార! మీచిత్త మెట్టి
గట్టియినుమున ఘనవజ్రఖండమునను
జేసెనోగాని యల్ల రాజీవభవుఁడు
పీతమతులార! ఛాందస విప్రులార! ౯౮

సీ. అగ్నిహోత్రమువైచి యంభోధి జలమింకఁ
జేయఁబూనెడు మూఢచిత్తుఁడైన
ఖరవాల మూఁతగాఁ గైకొని పాథోధి
నీదనెంచెడు బుద్ధిహీనుఁడైన
క్షీరమేళనచేఁ బయోరాశి క్షారత
మాన్ప నూహించెడు మందుఁడైన
బడబానలంబును బట్టంగఁ దలపోసి
జలధిలో నుఱుకు నజ్ఞానియైన
గీ. క్షుద్రతరకన్యకా వరశుల్కములును
బాల్యవిషమవివాహముల్ బాగటంచుఁ
బలుకఁజాలఁడు మీవంటిప్రాజ్ఞుల కివి
తగవు మానుఁడు! ఛాందసోత్తంసులార! ౯౯

సీ. ఆమయం బణఁప సిద్ధౌషధం బగునంచు
విషముఁ గ్రోలఁదలంచు వెఱ్ఱియైన
ఘనమైన నీరువట్టును దీర్చుకొన నెంచి
నేయిద్రావెడు నవినీతుఁడైన
నేల నింగియుఁబట్టి తాళంబు వాయింప
మానసంబునఁ గోరు మందుఁడైన
బలురోసమునరొప్పు పులిమీసములఁబట్టి
వ్రేలాడఁ బూనెడు బేలయైన

గీ. క్షుద్రతరకన్యకా వరశుల్కములును
బాల్యవిషము వివాహముల్ బాగటంచుఁ
బలుకఁజాలఁడు; మీవంటి ప్రాజ్ఞులకివి
తగవు మానుఁడు! ఛాందసోత్తంసులార! ౧౧౦

సీ. అతిబాల్యమున వివాహములు చేయుమటంచు
నార్యు లెందుననైన నానతి యిడిరె?
వేదంబులందైన విధియింపఁ బడియెనే?
స్మృతులయందెందైనఁ జెప్పఁబడెనె?
మనపూర్వు లెప్పుడైన నొనరించియుండిరే?
యేదేశమందైన నిట్టికలదె?
ఈదేశముననైన నెల్లవర్ణంబుల
వారొప్పి చేయుచున్నారె యెందు?

గీ. లోకవిపరీతమై మఱి లోకవృద్ధి
భంగకరమైనపని చేయఁ బాడి యగునె?
మదిని దయఁదాల్చి యీకీడు మాన్పరయ్య!
ధరణిసురులార! ధర్మావతారులార! ౧౧౧

సీ. జాతిపావనముకై జాతులఁ గల్పించి
యేకత్వమును బ్రతిష్ఠించినారు
రాజనీతి రచించి రారాజుల సృజించి
లీలతో విశ్వ మేలించినారు

గీ. స్త్రీలకు స్వయంవరంబులు చెల్లలేదె?
నేఁటికి మనీషగోల్పోయి పాటిదప్పి
తప్పుదారుల జరియించి యొప్పుదరిగి
తెలియరో గాక ద్విజకుల తిలకులార! ౧౦౫

సీ. అందరు యోగినులై చరింపగ లేరు
బ్రహ్మచర్యంబు పైపయిని లేదు
ఇంద్రియ నిగ్రహంబెంత వారికి గల్గు
భక్తి పుట్టుకతోనె పట్టువడదు
యతికైన వైరాగ్య మతి దుర్లభంబౌను
చలచిత్త మొకమాత్ర జక్కఁబడదు
అనుభవింపక యిచ్ఛ యణగాగునది కాదు
బుద్ధి యాంకెకుగాదు బోధవలన
గీ. శీలరక్షకు జాలు వశిత్వసిద్ధి
సాధనలవల్ల పూర్వ వాసనలవల్ల
గాని యావశ్యకము జూచి కలుగదెపుడు
గాన నిర్బంధ పద్ధతి మానరయ్య! ౧౦౬

సీ. నిర్బంధములఁబెట్టి నిలిపిన మాత్రాన
మామనోరథములు మరలునొక్కొ?
కట్టుబాటులు చేసి కష్టపెట్టిన మాత్ర
మాయభిలాషముల్ మాయునొక్కొ

మా చూపు రేఖలు మార్చి వేసినమాత్రి
మాకోరికలు మాటుమణఁగునొక్కొ!
మ మ్మొక్కపొద్దుల మాడ్చిన మాత్రాన
మాయిచ్చలు కృశించి మఱఁగునొక్కొ?

గీ. కలుగనేరాదు కాంక్షలు కలిగెనేని
ననుభవింపక నశియింప నజునికైన
నేలనిర్బంధ నరకాలపాలుచేసి
యేడిపించెద రిఁక జాలి జూడరయ్య! ౧౦౭

సీ. సృష్టి వైఖరిజూడ శృంగారమే తోఁచు
శుక శారికాదుల సొలపె తోఁచు
హరిణాదులను మనోహరలీలలే తోఁచు
దరు లతాదుల స్నేహసరణి తోఁచు
నీటు జోడులఁ జూడ వేడుకలే తోఁచు
జట్టాల వగఁ జూడఁ సొగసె తోఁచుఁ
దోడుల జాడలఁ జూడ ముచ్చటె తోఁచుఁ
దలిదండ్రులెడఁ జూడఁ దమియె తోఁచు

గీ. నెల్ల వాతావరణ మిట్లు లేకభంగిఁ
జిత్తములఁ గోరికల వేరి చిచ్చు రేపి
నిలువున దహించుచుండఁగ నిమిషమైన
మది నిలుప శక్యమే? బాల విధవ కకట! ౧౦౮

సీ. తనకు బంధువులకుఁ దల్లిదండ్రులకును
అత్తమామలకును నపయశముఁ దెచ్చు
కులము మానంబుఁ గూలిచి గోడుఁగూర్చుఁ
దవర కిహపరములకును జేటుఁ దెచ్చు!  ౧౧౦

సీ. పరఁగ వివాహంబుల మంత్రాల యర్థంబు
నించుకైనను విచారించరాదె?
మనుధర్మశాస్త్ర మేమనుచు బోధించునో
యదియైనఁ జింత సేయంగరాదె?
దేశకాలములఁ జింతించి ప్రస్తుత మేది
యనుకూలమో దానిఁ గొనఁగరాదె?
ఎల్ల దేశములవా రీవివాహము లెట్టు
లాచరింతురో దాని నరయరాదె?

గీ. బాల్యవైవాహికంబులవల్లఁ గలుగు
మాలనూటికంటెను గడు మేలుకాదె?
పుష్పవతులైన యందాకఁ బువ్వుఁబోండ్ల
నుంచి పెండ్లిండ్లు సేయంగ నొప్పరాదె?  ౧౧౧

రమణీవినాశ కారణమైన సహగమ
నాచారమును వీడనాడలేదొ?
బలిపేర మనుజులప్రాణాలఁ దీయు క్రూ
రాచారమును వీడనాడలేదొ?

## బాల వితంతు విలాపము.

కన్నసంతానంబు గంగపాల్సేయు ఘో
రాచారమును వీడనాడలేదో?
బహుహేయతమమైన వల్లభాచార్య మ
తాచారమును వీడనాడలేదో?

గీ. జనులలో నాగరికత హెచ్చిన కొలంది
సంస్కరించిరి మును దురాచారములను
బ్రాజ్ఞు లీయతి బాల్యవివాహములను
మాన్పఁగదరయ్య! వేవేగ మాన్యులార! ౧౧౨

సీ. ప్రకృతిశాస్త్రజ్ఞులు భావించి వలదంచు
ఘోషించుచుండ నూకొనఁగరాదె?
వైద్యశాస్త్రజ్ఞులు వరుసతోఁ దగదంచు
బోధించుచుండ నొప్పుకొనరాదె?
లోకజ్ఞులందఱు నేకభంగినిఁ గూడ
దని మొత్తులిడుచుండ వినఁగరాదె?
నవసంఘసంస్కర్త లవివేక మిదియంచు
వాదించుచుండఁగా వదలరాదె?

గీ. పూర్వనియమంబులని చేసి యోర్వరాని
బెడఁదలను దెచ్చిపెట్టి మీబిడ్డలకును
జూడఁజాలక వలపోయు గోడుకంటె
బాల్య వైవాహికంబులఁ బాపరాదె? ౧౧౩

సీ. తనదు పెండ్లియటంచుఁ దనమగం డితఁడంచు
నెంచియైనను సంతసించవచ్చు
పెండ్లిలోపలనైనఁ జెనిమిటిపొత్తున
భుజియించి ముచ్చటఁ బొందవచ్చు
అలుకపాన్పునఁ జేరునపుడైన భర్తకుఁ
దెలనాకుమడుపు లందింపవచ్చు
తమిఁ బునస్సంధాన సుముహూర్తమునఁనైనఁ
బతితోడ శయ్యపైఁ బండవచ్చు
ఆ. తనివి దీఱ మగనిఁ గనియైనఁ గొన్నాళ్ళు
మనసుగొంత దీర్చుకొనఁగవచ్చు
యువతులకు వివాహ మొనరించితిర యేని
గాన స్త్రీలఁగరుణఁ గానరయ్య! ౧౧౪

సీ. స్మృతిశాస్త్ర శ్రుతిపురాణేతిహాస నికాయ
మిది యుక్తమంచు ఘోషించుఁగాక
ఆబాలగోపాల మఖిల మానవకోటి
యిది మేలటంచు భాషించుఁగాక
బాంధవ ప్రజ హితాప్త పురోహిత శ్రేణి
యిది తప్పదంచు వేధించుఁగాక
కల మత ప్రతతి యేకగ్రీవముగ నొత్తి
యిది ధర్మమంచు బోధించుఁగాక

గీ. వెతలు తనకెన్నియో సంభవించుఁగాక
దంపతుల కెల్ల దుఃఖ సంధాయకములు
చిన్నపిల్లల పెండ్లిండ్లు చేయరాదు
ధరణిసురులార! యీనీతిఁ దలపరయ్య! ౧౧౫

సీ. నీతిదృష్టికి బక్షపాతంబు గాదొక్కొ?
స్త్రీలకు మాఱ్పెండ్లి చెల్లదన్న
నవనాగరికతకు నష్టంబు గాదొక్కొ?
యీదేశనియమంబు గాదటన్న
బ్రకృతి ధర్మము భంగపాటొందదొక్కొ? బాల
విధవ భోగములకు వెలియటన్న
దైవసృష్టికి విరోధమ్ము గాదొక్కొ? సం
తతి బాలవిధవకుఁ దగదటన్నఁ

గీ. చేటెఱుంగని ఛాందసుల్ చెప్పినట్టి
ధర్మములు దాటరాదని తలఁపబోక
విధవలను సధవలను గావింతురేని
శ్రేయమగు నన్నలార! యోజింపరయ్య! ౧౧౬

సీ. మగవారు బొడ్డున మాణిక్యములతోడఁ
బుట్టిరే మేమట్లు పుట్టలేదె?
భోగముల్ పొందంగఁ బురుషులే యోగ్యులే
యబలల కట్టి యోగ్యతయె లేదె?

మగవారలకు మారుమనువు న్యాయంబైన
నాడువారలకు న్యాయంబు కాదె?
పురుషుల కొక ధర్మమును స్త్రీల కింకొక్క-
ధర్మంబనుట విరుద్ధంబు కాదె?
గీ. దైవముఖమును జూచిన ధర్మమేదొ
తోచదే దుఃఖవారాశి దోగుచున్న
మాకు గలిగిన యాపద మానిపించి
శాశ్వత యశస్సు గనరే ద్విజన్ములార! ౧౧౭

సీ. లత కూనలను గళాన్వితలను గావించి
జ్ఞానమిచ్చుట తప్పుగాదుసుండు!
తలిరుబోణులకు స్వాతంత్ర్య భాగ్యమొసంగి
గారవించుట తప్పు గాదుసుండు!
అతివల కీడేరునందాక వైవాహి
కమ్ముఁ జేయమి తప్పుగాదుసుండు!
వలసిన విధవ కుద్వాహంబుఁ గావించి
యాదరించుట తప్పుగాదుసుండు!
గీ. విశ్వమానవ సహజంబు లీశ్వరప్ర
సాదితము లుత్తమాంగ రత్నభూషణములు
కేవలము ప్రాణపదములౌ కేశములను
ఖండనముఁ జేయమియుఁ దప్పుగాదుసుండు! ౧౧౮

సీ. సంగీతమందును సాహిత్యమందును
శీలసంపదయందుఁ జిన్నెలందు
చక్కందనమునందు జవ్వనంబందును
బలమునందును బుద్ధిబలమునందు
సద్గుణంబులయందు సరసతయందును
వీస మొండొరులకుఁ దీసిపోక
తనువులు రెండుగాఁ దనరారుచున్నను
నెల్లభావములందు నేకమగుచు
గీ. వలతితనముల నన్యోన్య వశ్యులగుచుఁ
జిరతరాయువు సంతతి సిరియుఁగలిగి
సౌఖ్యకీర్తుల నోలాడు సతులుఁ బతులుఁ
గలిగి భారతవర్షంబు చెలఁగుఁగాక! ౧౧౯

సీ. సకలవిద్యలునేర్పి స్వాతంత్ర్యములనిచ్చి
స్త్రీలఁ బూరుషు లాదరింతురుగాక!
దంపతులకు సౌఖ్యదంబులై యలరారు
ప్రౌఢా వివాహముల్ ప్రబలుగాక!
చత్వారికలపెండ్లి సర్వసమ్మతమయి
భ్రూణహత్యలు లేకపోవుగాక
శ్యామలందరు నిత్యసౌభాగ్య భాగ్య సం
శోభితలై సుఖించుదురుగాక!

బాల వితంతు విలాపము.

గీ. అసమ వైవాహికములెల్ల నణఁగుగాక!
కన్యకాశుల్కములు గంగఁ గలియుఁగాక!
పురుషభరణంబులును మాసిపోవుఁగాక!
ఎల్లశుభములు నిందు వర్ధిల్లుగాక! ౧౨౦

సీ. శారద మైత్రేయి సరసవాణుల మించు
ఘన విదుషీమణీ గణముతోడ
సతి యరుంధతి సీత సావిత్రి యనసూయ
లని యెన్నఁదగు సతీమణులతోడ
విదులాంబ కుంతి ద్రౌపది జిజా మల్లమ
లకు సాటి వీరమాతృకలతోడ
సత్యభామ సుభద్ర ఝాన్సి రుద్రమ లట్టి
వీర నారీమణీ వితతితోడ

గీ. నాచి వెంగమ మొల్లలఁ ద్రోచిపుచ్చు
సరస కవితా రమాధురంధరలతోడ
భాగ్యములతోడ శుభపరంపరలతోడ
భరతఖండంబు సర్వదా మురియుగాక! ౧౨౧

సంపూర్ణము.



శ్రీ సౌదామినీ ప్రెస్సు తణుకు.